

# సేవా వ్రత మహిమ.

కొండిపర్తి వీరభద్రాచార్యులుగారిచే

రచియింపఁబడినది.









ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

అయ్యంకి వేంకటరమణయ్యచే

ముద్రింపబడి ప్రకటింపఁబడియె.

---

వెల ౧ అణా.] ౧౯౨౦. [బెజవాడ.



# సేవా వ్రతము



సేవ యనగా నొకని యొద్ద కొలువుండి వాని యాజ్ఞల ననుసరించి పని చేయుట యని సామాన్యముగ నెంచబడుచున్నది. ఇం దుత్తరువుల జేసి పని చేయించుకొనువాడొకడు నట్టియుత్తరువుల ననుసరించి పని చేయువాడొకడు నుండవలయును. వీరిలో బని చేయు వానికి బనిచేయించుకొనువాడు ఋణస్థు డగుచున్నాడు. అధికారగర్వముచే గాని, ధనగర్వము చే గాని యింకె నేవిధమగు గర్వముచే గాని పనిం జేయించుకొనునతడు ఋణమను భావము ప్రకటిత మగుట కొప్పుకొనక పోవచ్చును. కాని యా భావమును మాత్ర మతడు భ్రాంతిగ నంగీకరింపక పోవుట లేదు. వ్యక్తమ్ము కాకున్నను ఋణమను భావము స్ఫురించుటచే తనే తా నేదియో ధనమునో దానితో దుల్యమగు మరొకదానినో సేవయొనర్చువాని కిడి

తాను ముక్తుడగుచున్నాడు. అటులు గాక యెవడు సేవలజేయించుకొని ప్రతిఫలమును నొసంగడో యతడు ఋణమును పెంచుకొనుచున్నాడు. ఒకడిట్లు ఋణగ్రస్థు డైనకొలదిని నికృష్టు డగుచుండును. అయినను నధికారబలము గలవారును, హెచ్చుపలుకుబడిగలవారును ననేకులచేత సేవల జేయించుకొనుచు, బ్రతిఫలముగ దమ దంభమును బ్రకటించుటచేతనే తృప్తులయి తాము ఋణమును బెంచుకొనుచుండుటను గ్రహింపజాలకుండుట శోచనీయము. మఱియు నెవడేనియు నట్టి ప్రతిఫలశూన్యమగు సేవ నొనర్పజాలనియెడ వా రాగ్రహము బూనుటయు, వృథాగా నపకారముల జేయ సాహసించుటయు గూడ సంభవించుచుండును. ఇదెంతయు విపరీతము! సేవలగ్రహించువారి విషయ మింతట విడిచి సేవల నొసర్చువారి సంగతి విచారింతము.

ఒకడు మఱొకని కెందులకై సేవ చేయుచున్నాడు? ప్రపంచమున నేపురుషుడును

నన్యులతోడ సంబంధములేక జీవింపజాలడు. మిగుల ననాగరికస్థితియందు గూడ నరున కేదో యొక సమయమున నితరుల సహాయము గావలయును. రోగపీడితు డైనప్పుడైనను మఱొకని సహాయము నపేక్షించును. నాగరికము నందిన సంఘములందు ధనాఢ్యులగువారితరుల సహాయము నపేక్షింప నవసరములేదని కొంద అనుకొందురు. కాని వారికే యితరుల సహాయ మత్యావసరము. ఆ సహాయమును ధనమునిచ్చి సంపాదించుటచే వారు దానిని ధనము చేగూర్చుచున్న దని భ్రమింతురు. పరుల సహాయమును జేకూర్చుకొనుట ధనము ద్వార కలుగునేగాని ధనమే సహాయముగా మారజాలదు. ఇట్లు ప్రతివాడును నితరుల సహాయమును బొంది జీవింపుచుండును. ఈ సహాయమును సంపాదించుకొఱకే పురుషుడు మఱొకనికి సేవ చేయుచున్నాడు. అనగా తనదగు శరీరబలమునుగాని, మానసికశక్తినిగాని, హస్తకౌశలమునుగాని, మఱి యే యితర సమర్థతనుగాని, మఱొకని

లాభము కొఱకై యుపయోగించి ప్రతిఫల
ముగ దాను కోరుదానిని సంపాదించుకొనుచు
న్నాడు. ఇట్టి సేవ చేయక మానవుడు జీవింప
జాలడు. సేవచేయుటలో కొందఱు కేవలము
తమపక్షమునే తమకుగలుగు లాభమునే గణిం
చి, మెలంగుదురు; మఱికొందరు తమసేవల
నందువారి పక్షమును గూడ విచారింతురు.
మరియు గొందరు కేవలము విధియను భావ
ముతో వర్తింతురు. కేవలము శరీర భోగములు
కొఱకై పాటుపడుట యధమము. అట్లు పాటు
పడువారికి వీలగునంత ప్రతిఫలమును లాగవల
యునను చింతయేగాని యందుకు దగిన సేవ
చేయుచుంటిమా యను విచారణయుండదు.
వారు చేయు సేవ యందు గుణమును సత్యా
ల్పముగ నుండును. జీవితమును నిలుపుకొనుట
కై విధిలేక పాటుపడుదురే గాని తమ నిపుణ
తను వృద్ధిచేసికొని క్రమక్రమముగ నుత్తమసే
వను చేయుశక్తిని సంపాదింప యత్నింపరు.
వీరు సదా పరుల యొత్తిడికి లోనయి మాత్ర
మే పనిచేయుదురు. వీరికెన్నడును సుఖము

లేదు. ఎల్లప్పుడును నేదియో కొరతయే గాన్పించుచుండును. వీరి కితరులపై ననుతాప ముండదు. తమ నితరులు ప్రేమింతురను నమ్మకముండదు. ఎదుటివారిగూర్చి తాను విచారించున ప్పుడుగాని, యితరులు దననుగూర్చి విచారించుదురను తలంపు గలుగదు. ఈరీతి స్వార్థపరులు తామెన్నడు నభివృద్ధినందరు. ఎల్లప్పుడును దమ కేయనిష్టము వాటిలునోయను భీతితో నుం ధురు. తుదకు స్వకీయ కుటుంబమువారి ప్రేమకును బాత్రులు గాజాలరు.

ఇట్టి స్వార్థపరులును దమ సేవలరూపమున పరోపకారము జేయుచునేయుందురు. కాని యీసంగతి దా మెఱుంగరు. ఆ పరోపకార సాధనమువలన లభించు మార్దవహృదయము, ఉన్నతభావములు, యోగ్యత, వీరియెడ గాన్పింపవు. వీరి ప్రపంచము కడు సంకుచితము. పురాణములలో వర్ణింపబడిన రాక్షసులే వీరన వచ్చును.

కొంతమంది తా మొనర్చు పనులితరుల మెప్పుబడయ వలయుననియు నితరులకు

లాభదాయకములుగ నుండవలయుననియు, తద్వారా తమకు రానున్న ప్రతిఫల మధికము గావలయుననియు, గోరుచుందురు. వీరియెడ స్వార్థపరార్థచింతలు రెండును గాన్పించుచుండు ను. తమలాభమును, తమసేవలగొనువారిలాభ మును, గూడ వీరి దృష్టియందుండును. పరుల కు హెచ్చులాభమును జేకూర్చి తాము హె చ్చు ప్రతిఫలమును సంపాదింపజూతురు. తా మొనర్చు సేవను తమకు లభించు బ్రతిఫల మును బోల్చిచూచుచుందురు. వీరు స్వార్థపరు లేయైనను బరోపకారమునుగూడ విచారిం పుచుందురు. స్వలాభాపేక్ష హెచ్చిన కొలదిని వీరు తమ నిపుణతను హెచ్చు చేసికొనుచుందురు. కొన్ని సందర్భములందు వీరసంతృప్తు లగుటయు, లేక గర్వితులగు టయు తటస్థింపవచ్చును. తా మొనరించు సేవకు దగిన ప్రతిఫలము రాలేదని భావింపవచ్చు ను. తాము శ్రమపడి తమ కౌశలమును వృద్ధి చేసికొనుట వృథాయని నిరుత్సాహులు కావ చ్చును. కాని తమ సేవలను మఱొక తెన్నున

నుపయోగించి యెక్కువఫలమును బడయవ చ్చునను నాశ వీరిని బ్రేరేపించుచుండును. వీరిప్రవృత్తి దీర్ఘకాలము మందగించియుండదు. మఱియు దాము లోకోపకారులమనుటే పాటిం చుచు, దాము పొందుఫలమును విస్మరించి వీరు గర్వితులుగావచ్చును. అయినను వీరివల న పరపీడన ముండదు. ఆత్మస్తుతిపరాయణత ప్రబలవచ్చును. చిరకాలాభ్యాసముచే బఱుగు సేవలు సాగుచునేయుండును. ఇటువంటివారు మధ్యములని చెప్పవచ్చును. వీరి కన్యుల యొత్తిడి మితముగా నుండిన జాలును. చాలవ ఱకు స్వకీయప్రేరణముచేతనే వీరు వర్తింపు చుందురు.

పైరీతిని నభ్యాసము చేయుటవలనగాని, లేక స్వభావముచేతగాని కొందరు స్వలాభ ము నంతగా గణింపరు. సదా పరోపకార చింతచేతనే ప్రవృత్తులైయుందురు. పరులకు నుపకృతి యొనర్చుట వారికి విధిగా దోచును. ఇందుకు వాదనలుగాని తర్కముగాని వారికన వసరము. వారు సహజముగ పరోపకారులై

యుందురు. తోడి జీవులకు సహాయముచేయు టేవారికి కానందము. ఎదుటివారు శ్రేయమునం దుటే వారి యాప్సితము. మనకొక రమ్యమగు పుష్పమును జూచిన సంతోషము గలిగినటుల వీరికి వికసిత వదనముల జూచుటవలన బరమానందము గలుగును. వీరు ఉత్తములు. వీరొనరించు సేవ మహా పవిత్రమైనది. వీరు నిజమగు జగదుపకర్తలు. వీరు గావించు ప్రతికార్యమును మహాయజ్ఞమే. వీరుభుజించు నాహారము, వీరుద్రావు పానీయములు, తుదకు వీ రనుభవించు భోగములునయితము యజ్ఞములే యగును. వాని వలన వారు ప్రపంచమునకు సలుపు నుపకృతి హెచ్చుచుండును. ఇట్టి వారు తా మనుభవించు దేనిచేతను బద్ధులుగారు. వానికొఱకై మోహమును బూనరు. తమ భోగములు మూడుమూరల న్నర పరిమితిగల దేహమునకని భావించి మెలగరు. జగమే వారి దేహము. లోకమే వారి ప్రాణము. వారి శ్వాసయెల్ల మహాయజ్ఞమున నర్పణమగు నాహుతియే. అట్టివారు ధన్యులు.

అటువంటి మహాపురుషులు దైవయోగము చేత జననమందవలయునుగాని, ప్రయత్నపూర్వకముగ సాధనచేసి యెవరుగాని పూర్ణస్వార్థత్యాగులును, పరోపకారధురీణులును గాగలరా యను సంశయము మనకు తోచుచుండును. కొంచెము సావధానముగ విచారణ సలిపితిమేని ఈ సంశయము నివారణ కాగలదు. మన వేదములు, పురాణములు, ఇతిహాసములు నేమని బోధించుచున్నవి?

ఈ చరాచర భూతప్రపంచ మంతయు, జగము సర్వమును యజ్ఞముచే బరగుచున్నది. ప్రథమమున హిరణ్యగర్భుడు మహాయజ్ఞమును బూని యందు స్వార్పణము గావించుకొని విశ్వసృష్టి సలిపియున్నాడు. వాని నిరంతరార్పణముచేతనే ప్రకృతియెల్ల స్థితి గాంచుచున్నది. మనమందరమును వాని యర్పణము యొక్క స్థూలరూపము లనియే చెప్పవలయును. వాని యాగసంకల్పమే మనయందనురాగముగను, ప్రేమముగను, ననుతాపముగను, వాత్సల్యముగను, మోహముగను, బెక్కు-

రూపముల వెలయుచున్నది. ఒక్క ప్రాణశక్తి యే స్థూలప్రపంచమున నుష్ణముగను, తేజస్సుగను, విద్యుచ్ఛక్తిగను, చలనముగను, ననేక విధముల బరగుచుండ-నేర్పరియగు భౌతిక శాస్త్రజ్ఞుడు వానినెల్ల దనయిచ్చవచ్చిన రూపాంతరమును బొందించి వినియోగించురీతిని, మన హృద్గతమగు ననుభావముల నన్నింటిని మన యిష్టమువచ్చిన భావముగ మార్చగలము. ఇందుకొకింత ధర్మపరిజ్ఞానమును సాధనయు నవసరము. ఈ ప్రపంచమున నవతరించిన మహాత్ముల జీవితములను వారిబోధలను విమర్శించితిమేని మనకీవిషయము తెల్లముగాగలదు. అఖండ కల్యాణ స్వరూపులగు శ్రీరామాదులు స్వార్పణముగావించి జగదుద్ధారణ నిమిత్తమై సంకుచిత మానవరూపముల దాల్చి, యొక్కొక్క గృహమును, గుటుంబమును దమవిగ నంగీకరించినటుల నటించిరి. క్రమక్రమముగ నుత్తమవిద్యాభ్యాసమును సలిపి జగమునగల జీవకోటినెల్ల దమదైనటుల భావించి మెలగి, తుదకు బ్రకృతి యంతయు

దామేయనియు బోధించిరి. అటువంటి భావ ములనంగీకరించిన వారెటుల జీవింపవలయు నో దమవృత్తములచే బ్రదర్శించిరి. వారు నడపిన జగన్నాటకములు మనకు మార్గదర్శ కములు. మనమును మన నిజస్వభావమును బ్రకాశమునకు దేవలయు నంటిమేని, మన మే మహాసంకల్ప ప్రతిఫలముగ నుంటిమో ఆమహా యజ్ఞమును నడుపవలయును. లోక సంగ్రహా ర్థమై త్యాగశీలమును సాధనచేయవలయును. పరోపకార జీవితమునకు గడంగవలయును. ఉత్తమసేవకులము గావలయును. బాహ్యప్రే రణ లేకయే, స్వబుద్ధిప్రేరణచేతనే లోకసేవకు బూనవలయును.

అన్ని మతగ్రంథములును, నన్ని దేశములం దలి తత్వజ్ఞులును సేవాధర్మ ముత్కృష్ట మని బోధించిరి. క్రీస్తు లోకరక్షణార్థమై స్వార్పణము గావించుకొనెను. తన జీవితము నర్పించెను. త నను సిలువపై బంధించి ప్రాణము దీయుచున్న వారి మోక్షముకొఱకై ప్రాణావసానకాలము నందు బ్రార్థించిన మహాత్ముడు. గ్రుడ్డివారికిని

ఘంటివారికిని సహాయముచేయుటయు, దాహాముగొనిన దీనునికి బురిసెడు నీళ్లుపోయుటయు దనకు సేవగా మారి స్వర్గప్రాప్తి నొసంగజాలువనియు, అందు జిత్తశుద్ధియే ముఖ్యమనియు దానము చేయబడిన వస్తువు ప్రధానము కాదనియు, బోధించినాడు. ఈ బోధ సర్వసామాన్యులకు గూడ పరోపకార సాధనయం దెంతయు నుత్సాహమును గొలుపుచున్నది.

మహమ్మదు నిటులనే బోధించినాడు. శాశ్వతజీవి గానెంచువాడు హత్యగావించు కొనవలయునని చమత్కారముగా బోధించినాడు. అహంకారము దనను దాను చంపుకొని పూర్ణస్వార్థత్యాగ శీలుడైన నరుడు శాశ్వతజీవి యగునని దాని భావము. ఈ మహాపురుషుని యుపదేశము నకుంఠితముగ నాచరణలో బెట్టిన నరు లెంతటి పరోపకారులుగనుందురో, యెట్టి పావనవర్తనులై యుందురో, యెలాటి సేవావ్రతులై యుందురో, వేరుగ దెలుపవలయునా? బుద్ధభగవానుడు నిటులనే బోధించినాడు. తన జీవితము నంతను బ్రపంచమున

జూపట్టు దుఃఖమును నివారించు మార్గమ్మును గనుగొనుటకును, నా మార్గము నందఱికిని దెలుపుటకునై వ్యయముచేసి యుండెను. వీరి మతమును స్వీకరించినవారు పూర్ణత్యాగశీలురైయుండి, యెక్కడ రోగులు, వికలాంగులు, దుఃఖార్తులు గనబడినను వారికి నుపచారము చేయుట జీవితధర్మముగా నవలంబింపవలయును. ఇటుల నవతారపురుషులెల్లరు త్యాగశీలమును, పరోపకారవిధిని బోధించియుండిరి. "పరోపకారముచేయుటే పుణ్యము, పరపీడనమే పాపము" అనగా నిర్మలసేవావ్రతమే పారమార్థికధర్మము, స్వలాభాపేక్షచే నితరులకు బాధగలించుట దోషము సనుటలో జిజ్ఞాసాపరులందరు నేకీభవించిరి. ఈ మహాయజ్ఞదీక్షనే యనేకు లనేకభంగుల నాంకిత భాషాభేదముతో నుపదేశించిరి.

మఱియు బరోపకృతిసలుపుట నవుని స్వభావము నై యున్నది. తలిదండ్రు లష్టకష్టములబడి బిడ్డల బోషింత్రుగదా! చిన్నబిడలున ముతము గడ్డిని నాకునలమును మేకలు మొ

దలగు. వానికి దినమిచ్చుచు మహదానందము ననుభవించుట మన మందఱము నెఱుంగుదుము. పసివారు సయితము దాము దినువానిని నెయ్యులకు బంచియిచ్చి ముదమందుదురు గదా! ఇంతయేల! ఆర్తు లెవరేని గాన్పించినచో మన నేత్రములనుండి కన్నీరు కారును. అప్రయత్నముగ సానునయంపు వాక్కులు మన నోట వెలువడును. మనకేమని వెడలిపోవ గాల్లాడవు. సానుభూతి యనునది మనకు నైజము. అపమార్గమునబడి మనమీ సహజసుగుణమును నడచివేయుచుంటిమేగాని, దాని యభావముచేత సేవాధర్మము నుపేక్షించుట లేదు. పరోపకారజీవితమును సాధనలో బెట్టవలయుననిన మనమేదో నూతన లక్షణమును, మానవాతీతధర్మమును దేనినో కష్టపడి సంపాదింప నవసరములేదు. సృష్టికర్త దేనిచే నీ జగము నంతను సృష్టించెనో, దేనిచే మన హృదంతరముల నన్నింటిని నింపి యుండెనో దేనిమహిమను మహాత్ములెల్ల తేటతెల్లముగ బోధింపుచుందురో, దేనిని క్షుద్రమగు స్వార్థ

పరతచే మనమడచిపెట్టుచుంటిమో యట్టి ప్రేమను బలాత్కారముగ నరికట్టక వర్తించి తిమేని మహాపవిత్రమగు సేవావ్రతము మన కత్యంతసులభ మగును.

ఉత్తమసేవావ్రతమునకు తగిన పూర్ణార్హత యందఱికిని సిద్ధముగ లభింపదు. అఖండస్వార్థత్యాగము సామాన్యులయందు ప్రస్ఫుటముగ ప్రకాశింపదు. ఇప్పటి విపరీత నాగరికస్థితిలో మిగుల నరుదు. అయినను మనము స్వార్థమును బూర్తిగ బాలించుకొనుచును పావన సేవావ్రతమునుగూడ సాధన చేయ బ్రారంభింపవచ్చును. స్వలాభార్థమై మనము చేయు ప్రతి పనియు నితరులకును గొంత లాభకరముగ నుండునటుల జూడవలయును. మన జీవితకార్యములందు బరుల కుపకార ముండకపోదు. దానినిగూడ మనసంకల్పమునందు జేర్చుచుండవలయును. దీనివలన బరశ్రేయమునువిచారించుట యలవడును. పరోపకార ధురీణులమను గర్వము మన యందు బొడమినను లోటులేదు. మన సైదమ లన్నింటను గ్రమముగ

బర శ్రేయోభిలాష ప్రాధాన్యమును వహించి యహంకారమును బారదోలును. కృత్రిమము లేక మనసంకల్పమును సదా నిర్మలముగ నుంచిన జాలును. ఇట్టి వృత్తము స్వభావముగ నేర్పడినకొలదిని మన స్వభావము సాత్వికమై స్వార్పణము నైజముగ గనబడుచు, సేవావ్రత మానందలీలలై, మనజీవితమే మహాయజ్ఞమై వెలయుగలదు.

మొదట క్షుద్రమును, స్థూలమును నగు స్వార్థపరతతో నారంభమైన సేవావ్రతము క్రమక్రమముగ బరార్థవిచారణకును, స్వార్థత్యాగమునకును, నహంకారనాశమునకును, శుద్ధసాత్వికవృత్తికిని, జగచ్ఛరణ్యమగు విశుద్ధప్రేమకును, తుదకు మోక్షమునకును సోపానపాళిని నిర్మించును. ఈ సేవావ్రతమునకగు సంకల్ప శుద్ధియున్నం జాలును. అది మొదట నెంత యల్పముగ నున్నను తుదకు ఘనాంతరఫలము నిచ్చును. మోక్షమునుసయితము సులభముగావించు పవిత్రసేవావ్రతమూనువాడు గర్వియగునా? మోక్షమను వా

హాఫలమును దా బొందుచుంటమని గ్రహించు
నేని దాను లోకమున కేదో యుపకారము
చేయుచున్నట్లు విఱ్ఱవీగునా? తాను లోకమున
కర్పించు స్వల్పమగు నుపకృతికై తాను పొం
దు ప్రతిఫలము ఘనతరమైనదని యెఱింగి
వినమ్రుడై యే యుండును. గర్వియై చెడునను
భీతి లేదు. సేవావ్రతమును సాధనచేయుటకు
బ్రారంభించినవారు మొదట నొక దినచర్యా
పుస్తకమును బెట్టుకొని దానియం దనుదిన
మును దా నితరుల కొనరించిన యుపకృతినొ
క్కదాన్నినైనను వ్రాయుచుండవలయు నని
విజ్ఞులు కొందఱు బోధింపుచున్నారు. ఈచర్య
గర్వహేతువగుననియు, నిట్టిపుస్తకములు యు
జమానులగూర్చి స్తోత్రపాఠముల జేయున
నియు గొందరుఱు శంకించుచుండిరి. ఇందు
గొంత సత్య ముండవచ్చును. కాని యజ
మానులు సేవావ్రతదీక్షను బూనినవారనియు
నట్టిజ్ఞానముతోడనే సర్వకాలసర్వావస్థలందు
ను మెలంగుదురనియు గ్రహించిన, యా భీతి
తొలంగును. [illegible]

తోచుచున్నది. తా మొనరించిన యుపకృతి తోపాటు, తాము పొందిన యుపకారమును గూడ ననుదినమును వ్రాసి పెట్టుకొనవచ్చును. జగమున మన కుపకారము నొసంగు విషయము లనేక మనుదినమును ననుభవములోనికి వచ్చుచున్నట్లు గ్రహింపనగును.

ఈ సకల చరాచర భూతప్రపంచమును సృష్టించి పాలించు నీశ్వరుడు తన ప్రపంచమునకు దాను సహాయముచేయలేక యత్యల్పప్రజ్ఞులమగు మన యుపకృతి కాశించుచుండెనా? సర్వశక్తివంతుడును, దయామయుండు నగు భగవంతుడుండ లోకమున నిందఱు కుంటివారు, గ్రుడ్డివారు, వికలాంగులు నిస్సహాయులు నుండ నుపేక్షించుటేల? మనము దీనరక్షణాలయములను, వైద్యశాలలను, సేవాసదనములను నిలిపి యీశ్వరునిచే జేవిడువబడిన వారిని రక్షించుట లేదా? అను ప్రశ్నలు సామాన్యుల బాధింపుచున్నవి.

నరుడు తా నెంత గొప్పవాడైనను నతడు చేయు మహాఘనకార్యములు సయితము

భగవంతుని కార్యములతో బోల్చి చూచిన నత్యంత క్షుద్రములై యొప్పును. స్వభావము చేత, మన మీప్రపంచమున నున్నంతవఱకును నేదోయొక పనిని చేయక నిమిషమైన నూరకుండలేము. ఆ పనిని యోగ్యతరముగ జేయుటకును, దానివలన సత్ఫలమును సంపాదించుటకును, మనము తరించుటకును విశుద్ధ సంకల్ప మావశ్యకము. శుద్ధసంకల్పము పరోపకారేచ్ఛచే దప్ప సాధ్యముకాదు. పరోపకారాభిలాష మన యుపకృతి నర్థించు వ్యష్టి గాన్పించినగాని ప్రేరణము గాంచజాలదు. ఈ ప్రేరణమున కవకాశము గల్పించుటకే పరమేశ్వరు డాయా యార్తుల రూపమున దర్శనమిచ్చుచుండె నని తత్వవేత్త లుపదేశించుచున్నారు. ఇదెంతయు సత్యము. సర్వాంతర్యామియు, జగన్మయుడు నగు పరమాత్మ యీ యార్తులందు నుండుగదా! ఈ యార్తుల జూచిన మనయందు ప్రేరణముగాంచు ననుతాపము రూపాంతరమున వెలయు నీశ్వరసేవాభిలాషయే. మన తరుణోపాయ

మే. అందువలన "మనము పనిచేయుక తప్ప దు. సతతము సత్కార్యాచరణమున మెలగవలయును. ఏలయన నదియే మనకు మహాప్రసాదము. మనము తరించుట కది యొక్కటే మార్గము. మనమే దేని ఉపకారము చేసియుండిన యే యాచకుడు గాని మనకొక పైసానైనను బాకీయుండెనని తలచరాదు. మనమే వానియెడ ఋణస్థుల మగుచున్నాము; అత డనుగ్రహించి మన సేవాధర్మము నాచరణలో బెట్టుకొనుట కవకాశ మొసగుచున్నాడు. మనము ప్రపంచమున కుపకారము చేయుచుంటి మని గాని, చేయగలమని గాని తలంచుటయు, వారికిని వీరికిని మేలొనరించితిమని గర్వించుటయు శుద్ధ మూఢభావము! ఆతలంపే మూఢత్వజనితము. మూఢభావములు దుఃఖకారణము లగును. మన మెవరికో యుపకారము చేసితిమని తలచి యతడు కృతజ్ఞత జూపవలయునని కోరుట, యతడారీతిని జేయ లేదనుకొనుట విషాదమును దెచ్చిపెట్టును. మనము చేయుదానికి బ్రతిఫలముగా

నేదియో రావలయునని మనము కోరనేల? నీ వుపకార మొనరించినవానిం గూర్చి నీవే కృతజ్ఞుడవై మెలగుము. వానిద్వారా భగవంతుని సేవ లభించినదని సంతసించుము. తోడి మానవుల సేవించుటద్వారా పరమేశ్వరార్చనము లభించుట మన యదృష్టముకాదా?" అని సేవావ్రత మహిమమును జక్కగ బోధించు శ్రీ వివేకానందుని యమృత వాక్యములను సదా స్మరింతుముగాక!

మతబోధలును తత్వవిదుల యుపదేశములును జిజ్ఞాసాపరుల యనుభవములు నిట్లుండగా దురదృష్టవశమున నీ యర్వాచీనకాలమున సేవావ్రతమహిమ పుడమి యెల్లెడల నరుదైనది. దానిని పునరుద్ధరణ మొనరింప వివేకానంద దయానంద ప్రముఖులు మన దేశమున జాలప్రతిష్టాపనలను నెలకొలిపిరి. దీనినే మఱొకరూపమున "భేడన్ పవెల్" అను భటాగ్రేసరుడు హూణదేశమున నెలకొలిపెను. బాలభటవర్గములు దానిశాఖలే. ఉత్సాహశీలురగు పాశ్చాత్త్యులా ప్రతిష్టాపనము నాదరవు, అమెరికా ఖండ

ములం దెల్లెడల నల్లుకొనునటుల బోధించిరి. అయ్యది మన దేశమునకును బ్రాకినది. పాఠశాలలవిద్యార్థులును యువకులును దాని నాదరించుచున్నారు. పంచదార యేరూపమున వరలినను దీపిగనే యుండురీతిని సేవావ్రత మేరూపమున బరగినను మాననీయమే! ఈరూపమును దేశకాలానుసరణముగ నున్నది. దీనినాచరణలో బెట్టుట యవశ్యకర్తవ్యమే.

ప్రపంచమంతయు ప్రజాస్వామికధర్మముమీదను స్వయంనిర్ణయసూత్రముననుసరించియు నడుచుచుండ సేవావ్రతము సాగు టెట్లనుశంక యనవసరము. ఈసేవాధర్మముస్వయంనిర్ణయసూత్రము ననుసరించియే నడచును. ఈసేవ యైచ్ఛికము. బలాత్కరించు నియామకుడు లేడు. ఇట్లనుటచే భటనాయకులు, భటశిక్షణము, లేదనుటకాదు. సర్వమును ప్రేమమయమై నడచుటచేత నందరు సోదరులై యైకమత్యముతోడ మెలంగుచుండ నాయకుల యుత్తరువులు తమహృదంతర ప్రేరణలుగనే భావించుచు తదితరులు వర్తింతురు. సర్వమును ప్రేమమయ

ము. సర్వమును నిజాత్మమయము. బాలభటజీవితము,వారిసేవావ్రతము, సృష్టికర్తయొక్క లోకపరిత్రాణ మహాసంకల్పముతో నైక్యము గాంచిన మహాయజ్ఞమే యగును. ఆపావన క్రతువునకు బ్రతి బాలభటుడును యజ్ఞకర్త యగుచున్నాడు. ఋత్విక్కులు బాలభట సోదరబృందమే. బాలభటనాయకులే యుపద్రష్టలు. యాగపశువు స్వార్థపరత. యజ్ఞఫలము పరమేశ్వరసంకల్ప నిర్వాహణము. ఇటుల వర్తిలు నీ పూజనీయ జీవిత మహాయజ్ఞమునకు బాలభటవర్గము పరాపేక్ష లేక సర్వసమర్థతతో నొప్పుచున్నది. మఱియు వీరి యజ్ఞసంకల్పము భగవత్సంకల్పముతో నభేదత్వమున బరగునదిగాన, లోకమందలి బాలభటవర్గము లన్నియు బ్రత్యక్షముగనో పరోక్షమార్గముననో యొక్క మహావృక్ష శాఖలై వెలయుచున్నవి. "నన్నెఱుంగకయే యనేకులు నన్ను సేవింపుచుండిరి" అని క్రీస్తు చెప్పినటుల బాలభటులు పరస్పరావలోకనమును ప్రత్యక్షబాంధవ్యమును లేకున్నను

కాలభటశాసనము వలన తాత్వికాద్వైత సిద్ధిని పొంది వరలుచుందురు. ఎందెందు స్వార్థపరతలేని నిష్కళంక ప్రేమైక సేవావ్రతము నడచునో యా ప్రదేశములెల్ల స్వర్గతుల్యములే యగును. శ్రీ హరిశ్చంద్రుడు కాపుండిన స్మశానవాటి కైలాసముగ రూపాంతరమందినటుల, వినిర్మలసేవావ్రతుని కర్మక్షేత్రము దేవలోకమే యగును. ఈ మహిమ నెఱింగిన పావనసేవావ్రతులు ధన్యులు. ముమ్మాటికిని ధన్యులు. ఓం శాంతి శ్శాంతిః.

